

# శతకభాగవతము.

గ్రంథకర్త,

పిసిపాటి సోమయ్య.




# శతక భాగవత




శ్రీకల్యాణగుణాకర!
లోకేశ్వర! సాధుభక్త • లోల! యనంతా!
నీకథల సంస్మరింతును
బ్రాకటసద్భక్తిఁ గృష్ణ • పరమాత్మ! హరీ! 1

క. జననము వృద్ధియు విలయముఁ
దనరఁగఁ జేయుదువు త్రిగుణ • ధాముఁడ వై చే
కొని యజ హరి హర సంజ్ఞలఁ
బ్రణుతామ్నాయుఁడవు కృష్ణ • పరమాత్మ! హరీ! 2

నీగుణనామవిశేషము
లేగతిఁ బల్కినను ముక్తి • హేతువు లై భూ
భాగమున వెలయు నవియే
భాగవతం బగును గృష్ణ • పరమాత్మ! హరీ! 3

# శతకభాగవతము.

క. భాగవతము సంస్కృతమున
భాగవతముఁ దెనుఁగుబాస ♦ వ్రాసినఘనులన్
యోగీశు వ్యాసుఁ బోతన
భాగవతు నుతింతుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 4

క. గీర్వాణాంధ్రమ్ములలోఁ
బూర్వము గలకవుల నిపుడు ♦ భువిఁ గలకవితా
ధూర్వహుల నాత్మ నెంచెదఁ
బర్వినవినయమునఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 5

క. శతకమున రామచరితము
శతకంబున భారతము నొ ♦ సంగితి నీకున్
గృతిగా భాగవతము శ్రీ
పతి! యిపు డర్పింతుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 6

క. శ్రీనిలయ! విశ్వమయ! నీ
పూనినలీలావతార ♦ ము లనంతము లం
దే నిందునఁ బ్రకటము లగు
వానిం గీర్తింతుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 7

క. అనయము షోడశకళ లే
పొనరఁగఁ బాథోధినడుమ ♦ యోగసుషుప్తిన్
దనరుదువు నీవు నిఖిలభు
వనైకకర్త వయి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 8

క. శిరములు గన్నులు గరములుఁ
జరణంబులుఁ బెక్కువేల ♦ సంఖ్యలు వెలుఁగన్
నెఱి సర్వాతీతుఁడ వై
పరగుదు వజ్జలధిఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 9

క. భువి ధర్మవిదూరం బౌ
నవసరమున దాని నడఁప ♦ నగురూపమునన్
దవిలి యుగయుగంబున సం
భవ మందెద వీవు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 10

క. తొలుతను బెస్మినము వై
విలయాబ్ధి విరించి కునుక ♦ వెడలిన వేదా
వళిఁ గొన్నహయగ్రీవుని
వలగొని మలిపితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 11

క. నిద్దుర మానిన వేలుపుఁ
బెద్దకు నిగమములచిక్కు ♦ విచ్చుచు మగుడన్
ముద్దుగఁ దెచ్చి యొసంగి వి
పద్దశ వుచ్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 12

క. వెండియు సత్యవ్రతభూ
మండలపతి కీవు బ్రహ్మ ♦ మార్గముఁ దెలియన్
దండిగ బోధించితి వా
కాృండిత్య మెలర్పఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 13

# శతకభాగవతము.

క. ప్రళయాబ్ధి మనువు విత్తన
ములు నోషధితతులు మునులు ♦ మునుఁగక యుండన్
నిలిపి పెనునావ దానిన్
వలనుగఁ దేల్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 14

క. ఆదిత్యులు దైత్యుల దెస
నాదృతిఁ గడు వెల్వరించి ♦ యత్నించిరి క్షీ
రోదధిఁ ద్రచ్చఁగ నమృతో
త్పాదనకై వారు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 15

క. తరిగడవ పాలవెల్లిగఁ
దరిగంబము మందరముగఁ ♦ దరిత్రాడహిగాఁ
దరువ సురాసురు లంబుధి
భరమై గిరి మునిఁగెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 16

క. హితమతి శరనిధిఁ గూర్మా
కృతిఁ గొని కవ్వంపుఁగొండఁ ♦ గ్రీడాగతి న
ద్భుతముగఁ దాలిచి యట శ్రీ
పతివైతివి నీవు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 17

క. ఉరమున నిందిర నిలుపుచుఁ
గరుణారసదృష్టి నమర ♦ గణముల కుదధిన్
దొరికినసుధ నిడి దనుజుల
పరిభవ మెడపితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 18

క. సనకాదులశాపంబునఁ
గనకాక్షుఁడు మఱియుఁ గనక ♦ కశిపుఁడు నాఁగన్
జనియించిరి జయవిజయు ల
వనిన్ దితిసతికిఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 19

క. ధరఁ జేర్చి చాపచుట్టగ
సరగునఁ గొని చనినరాత్రి ♦ చరుని హిరణ్యా
క్షు రహిం నడఁచి తబ్ధి మహా
వరాహదేహి వయి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 20

క. జయలక్ష్మి గారవింపఁగ
నయనిధి భూదేవి దక్షి ♦ ణంపుదంష్ట్రి వడిన్
బయి కెత్తి కడలి వెలువడ
భయ ముడిపితి వరితిఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 21

క. సాధించితి సోదరు నని
బోధపడంగఁ గనకకశి ♦ పుఁడు గడు నీపైఁ
గ్రోధించి నీదుభక్తుల
బాధింపం దొడఁగెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 22

క. నలువకడఁ గొన్నవరముల
కలిమిఁ బురందరుఁడు మొదలు ♦ గాఁ గలసురలన్
జల మూని హేమకశిపుఁడు
పలుబాములు వెట్టెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 23

క. ఆదైత్యపతిసుతుఁడు ప్ర
హ్లాదుఁడు సద్గుణగరిష్ఠుఁ ♦ డనిశము స్మరిపెన్
మేదురగతి భక్తి భవ
త్పాదము లెద నిల్పి కృష్ణ ♦ పరమాత్మ! హరీ 24

క. అక్కటతమునఁ బ్రహ్లాదుని
మిక్కిలికష్టములఁ బఱపె ♦ మేదిని నీకున్
ది క్కెవ్వం డని జనకుడు
వక్కాణించుమను గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 25

క. తఱిఁ గని విశ్వాత్ముఁడ వని
స్థిరపడ స్తంభమున నార ♦ సింహుఁడ వగుచున్
సురవైరిఁ జిదిపి తత్సుతుఁ
బరిరక్షించితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 26

క. నినుఁ దలఁచి పాడి విని వం
దన సేవార్చన సఖత్వ ♦ దాసత్వా త్మా
ర్పణములఁ జనుజనములు పా
వను లై నినుఁ గంద్రు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 27

క. బలి వజ్రి కడలి భృగువులఁ
గొలిచి తదీయకరుణ సమ ♦ కూడనకడిమిన్
లలి దేవధానిపైఁ బడి
బలభేదెం దోలెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ!

క. సురమాత యదితి నిన్నుం
బరమవ్రతనిష్ఠ వేఁడఁ ♦ బ్రత్యక్షం బై
వర మిడితి వామెసుతునిగఁ
బరఁగి బలిం బాపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 29

క. శ్రవణద్వాదశీదివమున
నవిరళ తేజమున వామ ♦ నాకృతి నీ వా
దివిజేశుజననికడుపున
భవముం గాంచితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 30

క. ఉపనయ నాదివిధులఁ గ
శ్యపుఁ డొనరింపఁ జనితి సవ ♦ నావనికి బలిఁ
గపటమునఁ గోరి కావను
బ్రపన్నుల సురలఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 31

క. ఏ మడిగెద విచ్చెద నీ
కామిత మని బలి వచింపఁ ♦ గా మూఁ డడుగుల్
గా మేర సాలు నంటివి
వామనమూర్తి వటుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 32

క. ఆదైతేయాగ్రణి బలి
యాదట నీకాళ్లు గడిగి ♦ యలశుక్రునివా
గ్వాదమ్ముఁ ద్రోచి యొసఁగెఁ ద్రి
పాదధరణి నీకుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 33

క. ఒకచరణంబున భువి వే
ఱొకటం దివి నాక్రమించి ♦ యుండమి నిర విం
కొకపదమున కాబలి విడు
వక బంధించితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 34

క. నతుఁడై శిరముం జూపిన
మతియుతు బలిదైత్యుఁ బొగడి ♦ మానుగ నతనిన్
సుతలమున కనిపి యాదే
వతలం బ్రోచితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 35

క. భృగువులలో జమదగ్నికి
జగతీభర ముడుప రామ ♦ సంజ్ఞ భవంబున్
దగఁ గని గొడ్డలి కెరగాఁ
బగ దెంచితి నృపులఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 36

క. ఘనబలుఁడు కార్తవీర్యా
ర్జునభూవిభుఁ డరుగుదెంచి ♦ సురభి హరించెన్
గనుఁ బ్రామి నీదుతండ్రినిఁ
బనుపడ దుర్బుద్ధి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 37

క. ఆనరనాథుఁ గుఠారము
చే నుగ్గాడి మొదవు నిలు ♦ సేరిచి పితరుం
డాన తిడఁ దీర్థసంసే
వానిరతిం జనితి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 38

క. అయర్జునుసుతు లెల్లరు
మాయించితి వబ్బ నంచు ♦ మది( గని యదనుగ
మీాయయ్యశిరము( ద్రెంచి ర
పాయము వాటిల్ల( గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 39

హైహయుల బ్రహ్మఘాతుల
నాహవమున( బరశుధార ♦ నణ(చితి విల( పె
ద్ద్రోహులరుధిరం బెల్ల( బ్ర
వాహము లై పాఱ( గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 40

క. ఇరువదియొకపరి రాజుల
నరసి ధరం దునిమి వారి ♦ దగురక్తముతో
నెఱపితి పైతృకతర్పణ
వరకర్మం బెలమి( గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 41

క. జనకునిసూడుం దీరిచి
జనకాజ్ఞను జరిపి జనకు ♦ సద్గతికోఱకై
జనపతుల గెడపినపా
వనచారిత్రుడవు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 42

క. పొలియింప రావణాసురు
నలురూపుల రామలక్ష్మ ♦ ణభరతశత్రు
ఘ్నులు నా దశరథునకు భూ
వలయమున( బొడమితి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 43

క. కౌశికమఖరక్షార్థము
భాసురగతిఁ బితరుఁ డనుపఁ ♦ బనివిని పడఁగా
నేసితి తాటకఁ గ్రతువు సె
భా సనఁ గాచితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 44

క. ఒరు లేరును విఱువంగా
నెఱుఁగనిశివధనువుఁ దునిమి ♦ యెలమిన్ మిథిలా
వరుసద్మంబున సీతను
బరిణయ మాడితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 45

క. రంగద్రాజకులోద్భవు
లం గూల్చి కుఠారధార ♦ లలి భూభరమున్
ద్రుంగించినభృగురాముని
భంగ మొనర్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 46

క. జనకుఁడు ప్రియసతి కైకకు
ముడు పొసఁగినవరము లెఱిఁగి ♦ మునివలెఁ జని తా
జనకజయు లక్ష్మణుఁడు రా
వనవాసము సలుపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 47

క. చని చిత్రకూటభూధర
మున కయ్యెడ విడిసి భరతుఁ ♦ బొల్పుగ రాజ్యం
బున నునిచి యంత దండక
వనమున కరిగితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 48

క. పంచవటిఁ బర్ణశాల ను
దంచితవిధి నుండ రావ ♦ ణానుజ మిముఁ గా
మించిన ముక్కుం జెక్కుచుఁ
బంచెను సౌమిత్రి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 49

క. అనుజాత దెలుపఁగా విని
జనకాత్మజరూపు మనసు ♦ చన మారీచున్
గనకమృగ మై నటింపఁగఁ
బనిచెను దశముఖుఁడు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 50

క. గతు లెనయఁగ నుటజముకడ
మతివిభ్రమ మొదవఁ దిరుగు ♦ మాయామృగ ము
ద్ధతిఁ దూల్చి తపుడు దానవ
పతి సీత హరించెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 51

క. జనకజఁ గొనిపో నడ్డము
పనినజటాయువును బక్ష ♦ సంధులు దొలఁగన్
దనుజేశుఁ డేసి వెడలెను
వనితామణిఁ గొంచుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 52

క. మునుకుచు సీతాన్వేషణ
మున కై చని ఋశ్యమూక ♦ మును గని సుగ్రీ
వునిసఖ్య మంది వాలిన్
బనివడి కూల్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 53

క. మారుతి భూసుత వెదకను
వారిధి లంఘించి యేఁగి ♦ వడిఁ గని దేవిన్
జేరెను నిను మగుడి లంక న
వారిగ దహియించి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 54

క. సీతకథఁ దెలుప వాయుజుఁ
డాతతకపిసైన్య మలర ♦ నరిగితి వీ వా
సేతువును గట్టి దనుజ
వ్రాతముఁ బోరివుచ్చఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 55

క. రావణు నిజసుతహితస
చ్ఛ్రావకనికరములతోడ ♦ ఛేదించి యనిన్
బావకుముఖమున సతి స
ద్భావముఁ గని కొంటి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 56

క. తీరిచి సురలపని జగ
ద్ధారముఁ దొలఁగించి భద్ర ♦ త విభీషణు లం
కారాజ్యస్థితి దయ నై
వారఁగ నిల్పితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 57

క. సీతాలక్ష్మణసహితుఁడ
వై తగఁ బుష్పకముమీఁద ♦ నర్కసుతాదుల్
ప్రీతిమెయి రా నయోధ్యకుఁ
బ్రాఁతిగ మరలితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 58

క. కౌసల్యాదుల కెఱఁగి వి
లాసము దొలుకాడ సూరె ♦ ల సుహృదు లెసఁగఁ
గోసలపట్టముఁ గైకొని
భాసిల్లితి జగతి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 59

క. వాసి చెడ మోపె నీసతి
పై సడి నొకపౌరుఁ డన్న ♦ వార్తను విని పోఁ
జేసితి వెస వాల్మీకిని
వాసంబున కామెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 60

చూలాలు గానఁ గనె సీ
తాలలనామణి కుశలవ ♦ తనయుల నెలమిఁ
మేలుగ వాల్మీకి వెనుప
వాలాయము వారిఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 61

క. కుశలవులు సర్వవిద్యా
కుశలత గడియించి మాని ♦ కూర్చిన దగునీ
విశదశ్రీరామకథా
భ్యసనాధికు లైరి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 62

క. గతమును వై దేహిపవి
త్రతయును వాల్మీకి దెల్పఁ ♦ దనుజాతుల వేఁ
గుతుకమునఁ బొందితి జన
ప్రతతులు నుతియింపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 63

క. మును దేవాసురసమరం
బున మడిసినదైత్యు లవనిఁ ♦ బుట్టి యలంపన్
జనియించితి వాయిడు మెడ
పను యదువంశమునఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 64

క. వసుదేవునిభార్యల నొక
శశిముఖి రోహిణికి శేష ♦ సంజ్ఞను దగునీ
యసమరుచి వొడమె సుతుఁడై
వసుమతి రాముఁ డనఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 65

క. ఆవసుదేవునివే ఱొక
దేవికి దేవకికిఁ బుట్టి ♦ తివి బాలుఁడ వై
నీ వంశభాగశిష్టత
వావిరి శుభవేళఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 66

క. అష్టమగర్భమ్మున బహు
ళాష్టమి గలరోహిణీస ♦ మన్వితరాత్రిన్
సృష్టిం గంటివి ధర్మ
భ్రష్టుల దండింపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 67

క. జననికిఁ బినతండ్రిసుతుం
డన నగుకంసుండు గ్రూరుఁ ♦ డతఁ డొక్కెడ నీ
జననము తనమృతి కనియెడు
ధ్వని నభమున వినియెఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 68

క. చెలియలు మఱఁదియు మనములఁ
గలఁత వడం గంసుఁ డుని చెఁ ♦ గారాగృహ మం
దలచోటున నుదయించితి
బలరామానుజుఁడ! కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 69

క. ధృత ఝష కూర్మ వరా హా
ద్భుతనరహరి వర్ణి రామ ♦ భూవరరామా
కృతుల జగము లాఁగిననీ
ప్రతిభ యరిది బాలకృష్ణ ♦ పరమాత్మ! హరీ! 70

క. చెయువుల విధివలెఁ గరుణా
మయదృష్టి జనార్దనునటు ♦ మఱిఁ బటురోషా
శ్రయమున రుద్రునిగతి న
వ్యయ! నీ వలరితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 71

క. చెల్లించుఁ గంసుఁ డని పురి
టి ల్లెడలించి జనకుఁ డిడి ♦ యెను నిను నా వ్రే
పల్లియ నందయశోదా
వల్లవు లోగిఁ బెంపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 72

క. చనుబాల విసముఁ గుడుపుచు
నినుఁ జంపఁగఁ గంసుఁ డంప ♦ నెఱి వచ్చినపూ
తనబలురక్కసియసువుల
పని ముగియించితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 73

క. బండియు గాలియు నై నిను
జెండాడఁ గడంగి నట్టి ♦ చెనఁటియసురులన్
దండి నడంచితి పసిపా
పండవుగా నుండి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 74

క. మన్నుఁ దినవచ్చునా? యని
నిన్నడుగ యశోద లేద ♦ ని నిజాస్యమునం
దున్నత మగువిశ్వాకృతిఁ
బన్నుగఁ జూపితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 75

క. నీదుడుకుఁ జేతలం గని
వా దడఁప యశోద ఱోల ♦ బంధింపంగా
మోదమునఁ గూల్చి తర్జున
పాదపములు దానఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 76

క. దీపింప మురళి కరమున
మేపుచు ధేనువుల గోప ♦ మిత్రులు సతముల్
గాపాడితి బృందావనిఁ
బ్రాపితభద్రములఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 77

క. బాలురఁ గ్రేపుల డాఁచఁగ
నాళీకభవుండు నీవు ♦ నలువుగఁ గొని యా
బాలకవత్సాకృతులం
బాలించితి మందఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 78

క. కాళియఫణిఫణములపైఁ
గా లిడి న_ర్తించి వానిఁ ♦ గాళింది విడఁగా
దోలుచు బ్రదికించితి గో
పాలకుమారకులఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 79

క. మానుగ గోపకు లొకనిసిఁ
గానను నిదురింప నగ్ని ♦ గడలుకొనంగా
మానుప వేఁడిన దవశిఖిఁ
బానముఁ జేసితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 80

క. జలకంబు లాడు వ్రేతల
వలువల హోసార్థి వగుచు ♦ వడిఁ గొని యువ్వా
రల వ్రెుక్కించి యుమా వ్రత
ఫల మొనగూర్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 81

క. పురుహూతుఁ డేడుదినములు
గురియింప శిలా ప్రవృష్టి ♦ గోవర్ధనభూ
ధర మె_త్తితి గోగోపక
పరితాపము లుడుపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 82

క. ముదమున యమునానదిలో
నద నెఱుఁగమి రేయిఁ గ్రుంకి ♦ యాలవరుణవశం
వదుఁ డై పోగిలెదునందుని
వదలించి తెచ్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 83

క. బలు నినుఁ గొని రాఁ గంసుం
డెలమిని నక్రూరు నంప ♦ నేఁగుచు యమునా
జలములఁ జూపితి భవదు
జ్జ్వల మగుతొలిమేనుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 84

క. లేపముల నంది కుబ్జకుఁ
బాపంబులఁ బాపి దేవ ♦ వక్రత వో స
ద్రూపం బొసఁగితి దయ నీ
ప్రా పేరికిఁ గాదు? కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 85

క. బంధుజనోత్సవముగ గ
ర్వాంధులఁ గంసాదిఖలులఁ ♦ గడ తేర్చి యనిన్
బంధురగతిఁ దలిదండ్రుల
బంధ మెడల్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 86

క. పొసరించి వడుగుఁ జదువం
గను నిను వసుదేవుఁ డనుపఁ ♦ గాశికి సాందీ
పనిఁ జేరి యెల్లవిద్దెలఁ
బనుపడ నేర్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 87

క. మరణించిన దేశికసుతు
గుఱుకొని జము నడిగి తెచ్చి ♦ గురుదక్షిణగాఁ
స్థిరభక్తి నిడితి గురునకుఁ
బరితుష్టి జనింపఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 88

క. వారింపఁగ మగధేశుని
వారాన్నిధిఁ గట్టఁ జేసి ♦ ద్వారక నందున్
జేరిచి మథురానగరపు
వారలఁ బ్రోచితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 89

క. సిరి మున్ను గొన్నవడువున
నెఱి నోరిచి చైద్యపక్ష ♦ నృపతుల నాజిన్
బరిణయ మైతి విదర్భే
శ్వరసుత రుక్మిణినిఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 90

క. హరియించి తా శమంతక
వరమణి ననునింద దొలఁగ ♦ భల్లుకపతి సం
గరమందు గెలిచి రత్నముఁ
బరఁగఁగఁ దెచ్చితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 91

క. ఆమణి సత్రాజితునకు
సేమముగాఁ దెచ్చి యిడిన ♦ చేఁతకుఁ గూఁతున్
బ్రేముడి నీ కీఁ గొంటివి
భామామణి సత్యఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 92

క. సురనాథు నిడుమఁ బఱపెడు
నరకాసురుఁ గూల్చి భండ ♦ నంబున నచ్చో
జెరఁ దొలఁచి రాచకన్నెల
వరియించితి కరుణఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 93

క. పొందుగ సతు లెనమండ్రున్
సుందరులు పదారువేల ♦ నూఱ్వురు గల రీ
వందఱ నన్నితనువులఁ గృ
పం దనియించితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 94

క. పొలఁతుక సత్యకుఁ బ్రియముగఁ
దలఁకొని యలపారిజాత ♦ తరువర మిలకున్
లలిఁ గొనివచ్చితి వనిలో
బలసూదను రొప్పి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 95

క. మరుదాత్మజన్ము నెపమునఁ
బొరిగొంటి జరాకుమారు ♦ భువి ధర్మజుచే
జరిపింప రాజసూయా
ధ్వరకృత్యము విభుతఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 96

క. ఘనరాజసూయయాగం
బున ధర్మజుఁ డీకు నగ్ర ♦ పూజ యొనర్పన్
గినిసి నిను దూఱుచైద్యా
వనిపతిఁ దునిమితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 97

క. సుదతి దను బంప నడుకులఁ
బదిలముగాఁ దెచ్చి యీయ ♦ బత్తిఁ గుచేలుం
డొదవినకరుణను బలు సం
పద లిడి ప్రోచితివి కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 98

క. బక వత్స కేశి ధేనుక
వృక ముష్టిక దంతవక్త్ర • వృష శంబర పౌం
డ్రక యవనాద్యసురుల విడు
వక మడియించితివి కృష్ణ • పరమాత్మ! హరీ! 99

క. జూదముకతమునఁ గౌర
వ్యాదినృపుల కాజి వుట్ట • నణఁచితి గర్వో
న్మాదుల నిలిపితి సూనృత
వాదులఁ బాండవులఁ గృష్ణ • పరమాత్మ! హరీ! 100

క. రక్షించితి ద్రౌపది నిట
లాక్షాస్త్రం బందఁ జేసి • తర్జును రథముఃదక్షత నడిపితి పాండవ
పక్షము వహియించి కృష్ణ • పరమాత్మ! హరీ! 101

క. పొలికలనుఁ జేరి స్వజనముఁ
బొలియింపఁగ శంక నొందు • బుద్ధి విడంగా
దెలిపితివి యోగశాస్త్రము
బలువిడిఁ గృష్ణునకుఁ గృష్ణ • పరమాత్మ! హరీ! 102

క. గురుశక్తి ద్రౌణి వఱపిన
శరవహ్ని నడంప వేఁడ • సతి యుత్తర స
త్వర మాయమగర్భము ని
ర్భరకృపఁ గాచితివి కృష్ణ • పరమాత్మ! హరీ! 103

క. కురుకులవరిష్ణువుగా
ధరణిఁ బరీక్షితుని మనిచి ♦ ధర్మజు సామ్రా
జ్యరమావిభుఁ జేసి జగ
ద్భర ముడిగించితివి కృష్ణ ♦ పరమాత్మా! హరీ! 104

క. ద్వారవతి వసించుచు సం
సారవిధం బొంది పాండు ♦ సంతతి యదుధా
త్రీరమణసగోత్రుల న
వ్వారిగ నేలితివి కృష్ణ ♦ పరమాత్మా! హరీ! 105

క. భేదాచారులు దుర్నయ
వాదులు లోకాపకార ♦ పరు లొగిఁ జెలఁగన్
మేదిని బుద్ధుఁడ వై ప్రతి
పాదించితి నీతిఁ గృష్ణ ♦ పరమాత్మా! హరీ! 106

క. ఘోరకలిప్రేరణమున
ధారుణిఁ గలుషమ్ము ప్రబలి ♦ ధర్మము పోలఁగన్
వారింపఁగఁ గల్క్యాకృతి
వారక ధరియింతు కృష్ణ ♦ పరమాత్మా! హరీ! 107

క. పురుషోత్తమ నారాయణ
హరి గోవింద మధుసూద ♦ నాధోక్షజ శ్రీ
ధర వాసుదేవ కేశవ
వరద హృషీకేశ కృష్ణ ♦ పరమాత్మా! హరీ! 108

క. అనిరుద్ధోపేంద్ర జనా
ర్దన మాధవ నారసింహ ♦ దామోదర వా
మన ప్రద్యుమ్న త్రివిక్రమ
వనజోదర కృష్ణ కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 109

క. నీలీల లెల్లఁ జేర్కొనఁ
జాలరు బ్రహ్మాదు లరయ ♦ సంకర్షణ! నే
పోలుట యెటు లచ్యుత! దయఁ
బాలింపఁగ దయ్య! కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 110

క. భారద్వాజసుగోత్రవి
హారునిఁ బిసిపాటి సుబ్బ ♦ యార్యతనూజు
ధారుణి సోమయసుకవిఁ గృ
పారతి రక్షించు కృష్ణ ♦ పరమాత్మ! హరీ! 111

క. ఈశతకభాగవతమును
వ్రాసినఁ జదివినను వినిన ♦ వఱలు శుభంబుల్
శ్రీసుతు లధికాయువు తుది
వాసిగ మోక్షంబుఁ గృష్ణ ♦ పరమాత్మ! హరీ! 112

సంపూర్ణము.

